## 6) ఏమండీ ? నా ముచ్చటలన్నీ తీరకుండానే పోతానా ?
**21-11-22**

### సుమసుందరి అర్ధరాత్రి రెండు గంటల వేళ ,మొద్దునిద్రపోతున్న మొగుడి జుట్టు పట్టి కుదిపి మరీ నిద్ర లేపింది.

" ఏమండీ నాకేవో పీడకలలు వస్తున్నాయండి . నా ముచ్చట్లు తీరకుండా నే నేను పోతానని యములోడు కల్లో కనపడి హెచ్చరిక చేస్తున్నాడండీ " అని భర్తను పట్టుకు బావురు మంది సుందరి.

ఈమె తనను ఎవరన్నా సుందరమ్మ గారు అంటే ఒప్పుకోదు . సుందరమ్మ గారు అని ఎవరన్నా అన్నప్పుడు , విని ఊరుకుంటే , తాను చెప్పుకుంటున్నట్లు తనకు నలభయ్ కాకా అరవై ఉన్నట్లు ఒప్పుకున్నట్లు అవుతుందని ఆమె భయం.

" ఏంటే నీ సొద .. నీకు తీరని ముచ్చట్లు ఏమున్నాయి . ఇల్లు కట్టాము .. కార్లు కొన్నాము .. నీకోరిక మీద నువ్వు పుట్టిన వూరిలో నీ కిష్టమైన నీ చిన్నప్పటి రామాలయానికి మరమత్తులు చేయించాము ..
పిల్లల్ని డాక్టర్లని చేసాం .. మానమళ్లు కూడా పుట్టారు .. వారి బాల సారెలకోసం పాతిక లక్షలు ఖర్చు పెట్టావు .. ఇంకా నీకు తీరని ముచ్చట్లు ఏమున్నాయని ? ఫో పొయ్యి అవతల పడుకో " అని భార్యను కసురుకొని ముసుగు తన్నాడు, సుందరి భర్త .

అయినా అతడు భార్య ప్రవర్తన ను నిర్లక్ష్యం చేయక మొరనాడు ఆమెను మానసిక డాక్టర్ దెగ్గరికి తీసుకు వెళ్ళాడు .

మానసికం అయన తరచీ తరచీ అడగగా , సుందరి ఇట్లా చెప్పింది " సార్ "101 - "అనే టీవీ ఛానెల్ లో " అచ్చట్లు - ముచ్చట్లు " అన్న ప్రోగ్రాము వస్తోంది . వాట్సాప్ లో సందేశం పంపటం ద్వారా ఎవరైనా సరే ఈ ప్రోగ్రాం లో ఒక కొత్త ముచ్చట స్టార్ట్ చేయవచ్చు .ఎక్కడెక్కడి మహిళలూ కూడా వాట్సాప్ సందేశాల ద్వారా తోటి మహిళలు పెట్టిన ముచ్చటలో పాలు పంచుకోని, ముచ్చట్లాడుకోవాలన్న తమ కుతి తీర్చుకోవచ్చు . . ఇప్పటికి ఆప్రోగ్రాము ఇరవై ఏళ్లుగా నడుస్తోంది . సుమారు పది ఏళ్ళ క్రితం నేను ఒక ముచ్చటకు తెరతీసాను " అని కాస్త ఆగింది సుందరి .
" ఏమిటమ్మా అది " అని ఆత్రంగా అడిగాడు - మానసికం అయన
.
"అదేనండి చెప్పా బోతున్నాను -- వినండి -- ఫదేళ్ళ క్రిందట మా ఎదురింట్లో ఒక కాపురం ప్రవేశించింది . అత్త గయ్యాళిది. కోడలు కయ్యాళిది .
<>అత్తగారు ఉదయం పూట, " కోడలా తులశమ్మకు నీళ్లు పోయవే" అని కోడలుకు ఆర్డర్ వేస్తుంది .. ఆ వెంటనే కోడలు " వారి భగవంతుడా ?" అని సూర్యుని వేపు తిరిగి సూర్యునికి నమస్కరించి. చీపిరి చేత పట్టి అత్తతో తగాదాకి దిగుతుంది .
<> అదే అత్తగారు ఉదయం ఫది , లేదా పదకొండు తరువాత " కోడలా స్నానం చేసి వంట మొదలెట్టమ్మా.. వాళ్ళు వేళకు అన్నాలకు ఇళ్లకు వస్తారు " అన్న వెంటనే, కోడలు " ఓహ్ మై గాడ్ " అని అరిచి క్రాస్ చేసుకొని నింగికి నమస్కరించి. రోకలి చేత పట్టి అత్తతో తగాదాకి దిగుతుంది .

,. <> అదే అత్తగారు మధ్యాన్నం మూడు తరువాత " కోడలా రేపటి టిఫిన్స్ కి ఏర్పాట్లు మొదలెడదామమ్మా .. . ఇడ్లీకి కాస్త పప్పునానా పోయి " అన్న వెంటనే కోడలు " యా అల్లా " అని అరిచి నాలుగు దిక్కులకు నమస్కరించి. చాకు చేత పట్టి

అత్తతో తగాదాకి దిగుతుంది.
అత్తగారిని తరిమి తరిమి ఇల్లంతా తిప్పుతుంది .

ఇక సాయంత్రం ఆరు దాటగానే అత్త కోడళ్ళు ఇద్దరూ కలిసి , దేముడి మీద, ఒక హిందుస్తానీ భజన పాట పాడి .పంచ హారతులు ఇచ్చి , దేముడి ముందు కేకు పెట్టి - కోస్తారు . ఆతరువాత నిమ్మకాయలకు నల్ల కాటుక -- పసుపు పూసి గుమ్మాలకి వ్రేలాడ దీస్తారు .
ఆతరువాత కొబ్బరికాయను అడ్డంగా కాకుండా నిలువుగా పగలకొట్టి చెరొక డిప్ప నెత్తిన పెట్టుకొని అరగంట పాటు ధ్యానం చేస్తారు -చివరాఖరున కొబ్బరి చెక్కలు డస్ట్ బిన్లో వేసి ఒకరికొకరు దణ్ణం పెట్టుకుంటారు "
దీనిని బట్టి మా ఎదురింటి వారి కులమేమిటి ? మతమేమిటి ? ఈ కోడలి కుల మేమిటి ? మతమేమిటి ? " వీరు అలా ఒకరి కొకరు నమస్కారాలు పెట్టుకోవటం చూసి ఏమనుకోవాలి ? అంటూ "101టీవీ" ఛానెల్ లో నేను ఒక ముచ్చట ప్రారంభించాను . ఈ ముచ్చటలో లక్షలాది మంది స్త్రీలు చేరి , జోరు జోరుగా ముచ్చట్లు నడుస్తున్నాయి . ఈ ముచ్చట్లు తీరకుండానే , ఎటూ తేలకుండానే ,ముగియకుండానే , నేను పోతానేమో నని నాకు భయం పట్టుకుంది డాక్టర్ " అని చెప్పుకుంది సుందరి .
[][]
" అవును బాగా ఆలోచించాల్సిన విషయమే .. .. వారానికి తరువాత కనపడు వమ్మా ..ఈ లోగ మందులు అవీ ఆలోచిస్తాను .. సార్ మీరు తక్షణం గుండు చేయించుకోండి " అని సలహా ఇచ్చాడు మానసికం డాక్టర్ .

**A ORIGINAL BY VARANASI SREE RAMA KRISHNA**

## (7)వంటింటి మహారాణి

ఒకానొక పూర్వపు కథ ప్రకారం ఒకానొక రాజుగారు వున్నారు . అయన పేరు ధర్మేంద్రుడు . ఈయనకి ఇంద్రునికి వున్నట్లే పర స్త్రీ వ్యామోహం వున్నది.

ఒకనాడు రాజుగారు సభ తీర్చి ఉండగా " ఒక సన్యాసి ఏ తెంచాడు . అయన తన జోలె లో నుండి రోజుల పసిగుడ్డు అయినా ఒక మొగ విపిల్లవాడిని తీసి రాజుకు ఇచ్చాడు ." ఈ పిల్లాడిని పెంచి మాకు అప్పగింపు - మేలవుతుంది " అని దీవించాడు .

అప్పుడు రాజు " ఎవరక్కడ - ఆ వంటింటి మహారాణిని పిలవండి " అని చెప్పి ఆమె రాగానే ఆమెకు పిల్లవాడిని అప్పగించి . " పిల్లవాడి పోషణ పాలనా చూస్తూ వుండు . సన్యాసి ఇచ్చిన ప్రసాదం - అందు వల్ల రాచ బిడ్డకు మల్లె సాకు " అని ఆనతి ఇచ్చాడు .

అసలు మహారాణులు ఎప్పుడూ వంటగదిలోకి అడుగు పెట్టరు. దాసీని పిలిచి ఆర్డర్లు  ఇస్తారు అంతే . వంటయింటిలో వుండే వారందరి మీద పెత్తం దారు ఒకతె ఉంటుంది . ఆ పెత్తం దారి కి నిక్ నేము ఏ ఈ వంటింటి మహారాణి. . రాజుగారు కూడా వంటయింటి మహారాణి అని పిలిచారుగదా ? దానికి ఒక కారణం వుంది . అందచందాలతో యవ్వనవతి ఐన ఈ వంటింటి మహారాణి రాజుగారికి ఒక ప్రేమ కాలక్షేపం .

వంటింటి మహారాణి తన అంద  చందాలతోనే కాక - రాజుగారి కోసమని ప్రత్యేకంగాను  కమ్మగాను  వండి వడ్డిస్తూ అయన పొట్టలోనుండి అయన గుండెల్లోకి వెళ్ళి ప్రత్యేక స్తానం సంపాదించుకుంది .ఒక సారీ రాజుగారికి ప్లస్ ఈ వంటింటి

రాణికి కలిసి పిల్లలను కన బోయారు . రాజు గారు ఆస్థాన వైదుడి ద్వారా ఎదో మందులు ఇప్పించి వ్యవహారం చక్క పడేసాడు . అప్పటినుండి వంటింటి రాణికి తనకొక కొడుకు వుండాలని వాడు రాజు తరువాత రాజు కావాలని ఆమె కోరుకుంది . తాను సంతానాన్ని కనటం రాజు ఎట్లాగో పడనివ్వడు కాబట్టి - సన్యాసి చేతులమీదుగా రాజుకు - రాజునుండి తనకు అందిన బిడ్డను సొంత బిడ్డ అనుకుంటూ పెంచింది .వాదించే అమ్మా అని పిలిపించుకుంది .వాడినే రాజును చేయాలనీ మనసులో శపధం పట్టింది .

సన్యాసి బిడ్డని ఇచ్చి పోయిన వెంటనే రాణి గారు వేగులను పెట్టి ఇంక్వైరీలు చేయించింది . తెలిసిన విషయాల వల్ల బిడ్డమీద అసలు రాణిగారికి ఏ ప్రేమా కలగలేదు ?దానితో "ఏమీ నేనూ ఒక బిడ్డను కనలేనా ? నేను కన్నబిడ్డలు అవుతేనే నాకు ముద్దు అవుతారు . వాడెవడో ? ఎవరో కని సత్రం అరుగు మీద వదిలేస్తే , అదేసత్రం లో బస వున్నా ఈ సన్యాసి తెచ్చి రాజుకు అంటకట్టాడు " అనుకున్నది . పిల్లడు సత్రం అరుగు మీద వదిలివేయ బడినవాడని వేగులు చెప్పిన వార్త పచ్చి నిజం.ఈ పిల్లాడి కి శాంతముడు అని పేరుపెట్టి పెంచుతోంది వంటింటి మహారాణి .

" నే ను ఆడో మొగో ఎవరో ఒకర్ని కనకపోతే సింహాసనాన్ని ఎవరో తన్నుకు పోతారు . ఖర్మం కాలి శాంతముడే రాజు అవుతాడేమో ? " అని మహారాణి భయపడి బిడ్డను కంటానికి పట్టు పట్టి అనేక ఔషధులు సేవించ సాగింది . చివరికి ఆమె గర్భవతి అయ్యింది . ఆమె పండంటి బిడ్డను కంటే తనకు గొప్ప బహుమతి దక్కటం ఖాయం అనుకున్న వైద్యుడు అనుక్షణం ఆమె ఆరోగ్యాన్ని కనిపెట్టుకుంటూ ఉండేవాడు .

రాణిగారికి కాన్పు అయ్యే రోజు వచ్చింది . పుట్టిన బిడ్డ దక్కదు అని వైద్యుడు గ్రహించాడు .

మృత శిశువును చూసి రాణి దుఃఖించి, ఆ కోపంలో తనకు వురి శిక్ష వేస్తునేమో అని వైద్యుడు భయ పడ్డాడు . ఆ సిస్తున్న బహుమతి రాక పోగా ప్రాణాలు పోయే టట్లు ఉన్నాయనివైద్యుడు తెగ భయ పడ్డాడు .

వైద్యుడు వంటింటి మహారాణిని పిలిచి ' రాణి గారు మృత శిశువును కననుంది . నువ్వు సరైన పోషకాహారం వేళపట్టుగా ఇవ్వలేదు ' అని తోస్తోంది .ఇప్పుడు మన కొంపలు అంటుకోనున్నాయి " అని బెదిరించి " నీవు ఈ రాత్రి కె ఎవరిదన్న బిడ్డని దొంగిలించుకొని తెచ్చి నీదెగ్గర పెట్టుకొని , నేనూ చెప్పినపుడు - మృత శిశివును రాణి పొత్తిళ్ళలో నుండి తొలగించి - నువ్వు తెచ్చిన శిశవును పడుకో పెడదాము . ఇద్దరమూ గండం గట్టెక్కు దాము అన్నాడు .

వంటింటి మహారాణి తెలివి తక్కువది కాదు . బుర్రకలది . అది తన బంధువర్గంలో అప్పుడే శిశువుని ప్రసవించిన ఒక స్త్రీని గుర్తించి " వదినా .. నీకు ఎట్లాగో ఆడపిల్లలంటే ఎక్కసంగా వున్నారు . పిల్లని నాకుఇవ్వు. రాజ మందిరంలో పెంచి - నాతరువాత నా అంత గొప్ప వంటలక్కను చేస్తాను " అని ఆశ పెట్టి ఆ పిల్లని తెచ్చి రాణిగారి పొత్తిళ్ళలో పడుకో పెట్టింది . గుట్టు చప్పుడు కాకుండా మృత శిశువును తొలగించింది . ఇప్పుడు ఆ పేదింటి పిల్ల రాణి గారి కూతురై రాచ ఠీవీతో పెరుగుతూ రచ్చ విద్యలు నేరుస్తూ వున్నది . ఈ పిల్ల పేరు అరుణా రాణి .

<><><>

8) డాక్టర్ .వంకాయల వెంకట మణి 29-10-22

డాక్టర్ .వంకాయల వెంకట మణి .. స్నానము , ముగించుకొని వచ్చి " అబ్బా ఈయన మూలకంగా నాకీ ఆపరేషన్స్ తప్పేట్లు లేవు " అనుకుంటూ సంచీలో వున్నాకిలో వంకాయలను కొత్తిమీరను మిర్చిని కిందకు ఓంపింది . భర్తలు తెచ్చేవన్నీ చచ్చు పుచ్చు వంకాయిలే అయి ఉంటాయి . షాపు వాళ్ళు మొగవాళ్ళకి పుచ్చు వంకాయలు అంటగట్టి ఇట్లాగే మోసం చేస్తూ వుంటారు అనుకుంటూ అదే నమ్మకంతో ఆమె" నాకీ ఆపరేషన్స్ తప్పేట్లు లేవు" అంది .
. "వంకాయలను కోసి పుచ్చులు జాగర్తగా తొలిగించి వంకాయను కూరకు సిద్ధం చేయటం అనేది , ఒక నిజం డాక్టర్ రోగి శరీరం లోని వ్రణం తొలగించటంతోసమానం" అని " డాక్టర్ వంకాయల అనే ఇంటిపేరు గల, వెంకట మణి అభిప్రాయం - వెంకట మణి డాక్టార్ గాని డాక్టర్ అంటే లిటరరీ డాక్టర్. అంటేపీహెచ్డీ డాక్టర్ . ఆమెకు కొంచెం చేమత్కార దృష్టి ఎక్కువ . వంకాయలలో పుచ్చు తొలగిస్తూ , తాను వంకాయలకు ఆపరేషన్ చేస్తున్నట్లు ఫీల్ అయ్యి ముసిముసిగా నవ్వుకుని . " ఏమైనా నేనూ డాక్టర్నేగా ? " అని గతం గుర్తు తెచ్చుకుంది .

వెంకట మణి పెళ్లిఅయినాక , భర్తని బలవంతంగా ఒప్పించి సంస్కృతం లో ఎం.ఏ . చేసింది . ఆ తరువాత ' పురాతన తాళ పత్ర గ్రంధాలు- అందులోని అతి రహస్యాలు " అనే విషయం మీద పీహెచ్డీ చేసింది .

వెంకట మణి భర్త ఎం ఏ సంస్కృత పండితుడు --. కాలేజీలో లెక్చరర్ . వేడినీళ్లకు చన్నీళ్ళకు తోడుగా వుంటాదని , పాత సంస్కృత పుస్తకాలు తిరగేసి బోర్లేసి .. ఏమిటేమిటో అర్ధంచేసుకుని ఏమేమో అర్ధాలు తీసి .. పురాణ ప్రవచనం ఇవ్వటం మొదలేసాడు .అది గిట్టుబాటుగానేవుంది . కానీ ఈ రంగం లో పోటీ ఎక్కువగా ఉన్నందువల్ల ప్రతి నిత్యం కొత్త సంగతులు కావాల్సి వస్తోంది .

కొత్త సంగతుల కోసం అని అతడు , వెంకట మణి ని తాళపత్రాల లో వున్నా అద్భుత రహస్యాలు తనకి చెప్పి హెల్పింగ్ చేయమని అడిగాడు . వెంకట మణి తాను తాళ పత్రగ్రంధాలను పరిశీలించి తెలుసుకున్న వింత సంగతులు తరచూ భర్త చెవిన వేస్తుంది . అతడు దానికి మసి పూసి మారేడు కాయ చేసి ప్రవచనం చేస్తాడు .

"ఏడేడు జన్మల బంధం " అనే దానిమీద ఇవాళ అయన ప్రవచించాలిఅని ఓ టీవీ ఛానెల్ వారు అడిగారు . ఏదైనా మసాలా మ్యాటర్ తయారు చేయి " అని భార్యకు పురమాయించి ఆయన కాలేజీకి పోయినాడు . , సులోచన తన భర్త రాగానే " ఏమండీ నన్ను ఇంకా తిట్టండి,తన్నండి , నిర్భయంగా మా అమ్మానాన్నలని కూడా తిట్టండి .. కావాలంటే మమ్మల్ని మా వంశాన్ని చెడుగుడు ఆడేసుకోండి . ప్లీజ్ ప్లీజ్ " అని అడిగింది .

అందరి లాగానే ఈయన గూడ పెళ్ళాన్ని తిడతాడు . ఆమె తల్లి తండ్రులను తూర్పార పడతాడు .వంశ వృక్షాన్ని కెలుకుతాడు . ఈమెకు ఎక్కడో మండిస్తాడు. తన పుట్టింటి వారిని ఎవరైనా నిందిస్తే అగ్గి బుగ్గి అయ్యే వెంకట మణి , నేడు

ఇట్లా అడగటం ఆమె భర్తకే కాదు చుస్తూ వున్నా
పంచభూతాలలో కూడా ఆసక్తి కలిగించాయి .

తనను దాటి తన భార్య పీ హెచ్ డీ చేసిందని ఇతనికి కుళ్ళు . మొగవాడిదే పై చేయి అని చూపించుకోవటానికి అని ఆమెను తిడుతూ ఉంటాడు .. ఆమె తిరిగి తిడుతూ ఉంటుంది . ఇతడు కొట్టబోతాడు . ఆమె ఇతన్ని యెగిరి తన్న బోతుంది .అప్పుడు ఈయన ఆమె వంశ వృక్షాన్ని కుళ్ళ బొడుస్తూ ఉంటాడు . ఇలాంటి నేపథ్యం లో జరుగుతూ వుంది వారి దాంపత్యం .

తన భార్య అడిగినది విని అతను ఆశర్యపోయి "ఎందుకో ? "అని అడిగాడు సంతోషంగా . " భర్త తిట్టి నప్పుడు ఎదురు చెపితే " ఏడేడు జన్మల బంధం కొనసాగదని _ తాళపత్రాల గ్రంధం చదివి ఆమె ఏదన్న కనిపెట్టిందా ? అని ఆలోచించాడు .

వెంకట మణి ఏమి చెప్పిందంటే " ఏమండీ ఇవాళ ఒక పురాతన తాళ పత్రగ్రంథంలో ఒక నిగూఢమైన భావం తో ఒక విచిత్రమైన పద్యం కనపడిందండి . దానిప్రకారం ఏడేడు జన్మల బంధం అంటే ఏమిటి ?అనే దారిగురించి చక్కని వివరణ దొరికింది . దాని ప్రకారం భార్యని కొట్టీ తిట్టి, ఆమె వంశ వృక్షాన్ని నిందించిన భర్తని - యమలోకంలో ని యములోళ్ళు కళాయిలో వేసి డీప్ గా వేపుతారు . ఏడేడు జన్మల బంధం స్కీం కింద యమభటులు అతడి భార్యని పిలిచి " అమ్మా వేపుడు చక్కగా అయ్యిందో లేదో చెప్పు. నువ్వు సంతోషం తో ఓకే అంటాం మాకు ముఖ్యం " అని అడుగుతారుట . అప్పుడు భార్య సంతోషకరమైన ముఖంతో " బహు చక్కగా వేపారు " అన్నప్పుడె వారు వేపుడు మాని

వేస్తారు . . ఇక భార్య సంతోషకరమైన ముఖం పెట్టకపోతే ను - బాగా వేపారు అని కంప్లిమెంట్ చేయకపోతేనూ వారు వేపుడు చేయటం మానరు . ఇప్పుడు భార్యకనుక దయదలిచి ' బాగానే వేపారు అని అబద్ధం ఆడిందనుకోండి - అతడిని ఆరోజంతా మార్చి మార్చి వేపుతారు .

ఇట్లా భర్త అనేవాడు ఏడు జన్మలు పూర్తి చేసుకునే వరకు, అతని భార్యని పిలిచి ఆమె అభిప్రాయం అడుగుతారు . ఇదే ఏడేడు జన్మల బంధము అంటే . అంతేగానీ ఏడేడు జన్మలకూ వీరే భార్య భర్తలుగా ఉంటారని కాదు --- చివరకు పురుషుడు ఎనిమిదో జన్మఎత్తినప్పుడు పెళ్లి చేసుకొంకుండా ఉంటే అక్కడితో ఆ భంధం తెగి పోతుంది.

. ఇక తొమ్మిదో జన్మఅనేది ఉంటే మళ్ళా పెళ్లి - మళ్ళా వేపుడు " అంతా వరస ప్రకారం మామూలే .

" వచ్చి వేపుడు సరిగ్గా జరిగిందో లేదో చూడమని యములోళ్ళు భార్యని అడుగుటయే . దే ఏడేడు జన్మల బంధము అంటే . అంతే గానీ ఏడేడు జన్మలకు నువ్వే నాకు భర్త నేన్న నీకు భార్య కావటం కాదు " అని చెప్పి ముగించింది వెంకట మణి.

ఎందుకైనా మంచిదని ఆ శ్లోకం వున్నా తాళపత్రాన్ని భర్తకి చూపింది . అతడు తాళ పత్ర గ్రంధాలలో వున్నా విషయాలకు శివుని ఆజ్ఞ కన్నా ఎక్కువ విలువ ఇస్తాడు . శ్లోకాన్ని ఒకటికి ఫది సార్లు చదివి చివరికి వేరే అర్ధం ఏమీ తోచక తల వెళ్లాడా వేసాడు .

సులోచన ఇట్లా తాళ పాత్ర గ్రంధాల రహస్యాలు విడమరిచి చెపుతూ ఉండగా వేరొకరు విని దాన్ని రికార్డు చేశారు . అట్లా?

యెట్లా ? కుదిరింది అంటే ఈయన ఫోను మాట్లాడుతూ ఇంట్లోకివచ్చి . భార్య మీద విసుక్కుంటూ , దాన్ని ఆఫ్ చేయకుండా అట్లాగే ఉంచేసాడు . అవతలి వాళ్ళు ఈ విషయాలు విని వాయిస్ రికార్డింగ్ చేసి యు ట్యూబులో ను లో వాట్సాప్ లో ను పెట్టి లక్షల మందికి ప్రసారం చేశారు .

ఆ సాయంత్రం ఈయన ప్రవచనం చేస్తూ " ఏడేడు జన్మల బంధం ఏర్పరుచుకోవడం కంటే బ్రహ్మ చర్య వ్రతం అవలంభించి ఈలోకంలోనూ, పరలోకంలోనూ సుఖపడటం మంచిది అని శాస్త్రాల్లో లిఖించి వుంది . నేనిప్పుడు ఆశ్లోకం చదువుతాను కానీ అర్థం చెప్పను . ఈ శ్లోకం కారణంగానే లోకంలోని చాలామంది బ్రహ్మ ఛైర్యం అవలంబించుట , మరి కొంత మంది సన్యాసులుగా ను స్వామీజీలు గాను మారుట జరిగింది " అని చెప్పి క్షణంలో ప్రసంగాన్ని ఇంకో దిక్కుకు మళ్ళించాడు . ఆనాటి నుండి అతను వెంకటమణిని పల్లెతు మాట అంటే ఒట్టు .

<<>>

9) దీపాల అచ్చెన్న గాథ.....27-10-22

పెద్ద కొండ వుంది . అందుమీద కురిశిన వర్షమంతా కలువలుకట్టి . ఒక కొండవాగుగా మారి కిందకు ప్రవహిస్తూ ఉంటుంది . ఈ వాగులో ఎండాకాలం కూడా కొంత నీరు ఉంటూనే నే ఉంటుంది . కారణము -కొండపగుళ్ళలోకి ఇంకిన నీరు కొద్దికొద్దిగా బయటికి వచ్చి వాగులో కి పారటమే .

,<>

ప్రకృతి చేసిన ఈ ఏర్పాటులను గమనించి , అచ్చెన్న అనే రైతు -ఈ ప్రాంతానికి తన కొడుకులూ కోడళ్ళూ మనవళ్లతో

కలిసి వచ్చి కొండ దిగువగా ఇళ్లు కట్టుకొనాడు . అందరివీ కలిసి అవి సుమారుగా ఫది ఇండ్లు . ఫది ఇండ్లవారు ఒకే కుటుంబం వారు కాబట్టి ,కలిసి మెలిసి ఉంటూ , వాగు పారుచున్న చివరలో ఒక చెరువు తవ్వారు . చెరువుకింద భూమిలోని రాళ్లు రప్పలు తొలిగించి దాన్ని వ్యవసాయ భూమిగా మార్చుకున్నారు .
సుమారుగా ఒక పొంద ఎకరాలు
<> .
కొన్నాళ్ళకి ఎవరో ఒక జమీందారు గారి మనిషి వచ్చి భూమి శిస్తు కట్టాలి అన్నాడు . దీనికి గాను జమీందారు ఇతని భూమి హక్కులను గుర్తించి - ఏదన్న అవసర పడ్డప్పుడు - అంటే ఇంకా వేరే ఎవరన్నా వచ్చి భూములను ఆక్రమించబోతున్నప్పుడు - అచ్చెన్న కి బలగాలను పంపుతానన్నాడు .

చెరువునుండి సాగునీరు తాగు నీరు లభిస్తూ వుంటటంతో - ఎక్కడెక్కడి వారో వచ్చి భూమి కావాలని అచ్చన్ననే అడిగారు . మంచి వారు కష్టపడేటి వారు అనుకున్న వారికి వృత్తి విద్యలవారికి భూములు అమర్చాడు ,అచ్చన్న . చివరికి అచ్చెన్న వూరికి మకుటం లేని మహారాజు అయి నాడు . నేడు వూరిలో ఐదు వందల గడప వున్నది . అందరూ అతని మాటను మన్నిస్తూ వున్నారు .
<>
పైఊరే, నేడు అచ్చెన్న పల్లి అనే వూరు .
<>
ఈ కథ జరిగే నాటికి ఇంకా పూర్వకాలమే . ఎంత పూర్వకాలం అంటే గడియారాలు అనేవి ఇంకా రాలేదు . టైం తెలుసుకోవటానికి ఇసుక గడియారాలు - నీళ్ల గడియారాలు ఉపయోగంలో ఉండేవి . నీళ్ల గడియారం అంటే ఒక పెద్ద గిన్నెలో నీరు పోసి దాని నుండి బొట్టు బొట్టుగా నీరు కిందన వుండే పాత్రలోకి పడేటట్లు చేసేవారు . పైపాత్ర పూర్తిగా ఖాళీ అవటానికి పట్టే సమయం ఒక గంట అని లెక్క

.
మొదటి తరం అచ్చెన్న కు నేడు ఆరోతరం వారసుడి పేరు కూడా అచ్చన్న నే . వంశపారంపర్యంగా వస్తున్నా అధికారాల వల్ల - ఇప్పుడు ఈ ఆరోతరం అచ్చెన్న కూడా వూరికి తిరుగులేని నాయకుడు . అధికారి అయినాడు . ఈయన చెన్న పట్నం నుండీ ఒక నీటి గడియారం తెప్పించాడు .సూర్యో దయం జరిగి ఒక గంట గడిచాక ఒక పెద్ద ఢంకా మీద ఒక దెబ్బ వేసేవారు అచ్చెన్న బంట్లు . రెండో గంటగడిచాక రెండు ఢంకా దెబ్బలు వేసేవారు . ఈ చప్పుడు ఊరుని దాటి పొలాలలోనికి కూడా వినపడేది . . పొద్దు పొడిచి అప్పుడే గంట దాటింది , రెండు గంటలు దాటింది అనుకుంటూ పనులలోకి పరుగెత్తే వారు జనం .

ఇదేరకముగా రాత్రి కూడా ఢంకా దెబ్బలు కొడితే ప్రజలకు నిద్రా భంగము ,పైగా చెట్లపై నివసించే పిట్టలకు పక్షులకు జంతువుల కు దొరికే రాత్రి ప్రశాంతకు భంగముఅవుతుంది అని ఆలోచించిన మన అచ్చెన్న దొర, రాత్రిపూట ఈ ఢంకా దెబ్బలు కార్యక్రమాన్ని మానుకున్నాడు . దీన్ని బట్టే అతని మంచి మనసు మనము గ్రహించుకో వచ్చు .

కానీ , ప్రజలు కాలానుగుణంగా పనులు చేసుకుంటూ ఒక క్రమ శిక్షణ అలవర్చుకోవల్లన్న ఆలోచన అచ్చెన్న దొర ను వదిలిపోలేదు .

అయన పట్నం నుండి ,కొన్ని, అంటే ఒక డజను హారికెన్ లాంతర్లు తెప్పించాడు . వీటి ని 1846 లో Abraham Pineo గెస్నేరనే విదేశీ ఆయన న కనిపెడితే - అవి RECENTGAA మనదేశంలోకి వచ్చాయి . {మొన్న మొన్నటి దాకా మనం వీటిని కిరోసిను లాంతర్లు అని పిలిచి వాడి వదిలేశాము ) . హెూరికెన్ లాంతర్లు ఈదురు గాలులకు , వర్షపు గాలికి ఆరిపోవు . అదీ వీటి

గొప్పతనం .
<>
మన అచ్చెన్న గారు . ఊరి లోని ప్రజలందరికీ కన పడే వీలున్న కొండ ప్రదేశాన్ని ఎన్నుకుని . అక్కడి నేలని చదును చేయించి , నడుమెత్తు గోడ కట్టించాడు .
సాయంత్రం సూర్యాస్తమయం అవగానే ఒక గంట అయినాక ఒక లాంతరు వెలిగించి - చెప్పిన గోడ పైన పెట్టించే వాడు . నాలుగు గంటలు గడిస్తే ఆ గోడమీద నాలుగు లాంతర్లు వెలుగుతూ కనపడేవి ఆరు గంటలు గడిస్తే ఆరు లాంతర్లు .పదకొండు గంటలు గడిస్తే పదకొండు లాంతర్లు వెలుగుతూ కనపడేవి . పన్నెండవ గంటగా సూర్యుడే వెలిగే వాడు . ఈ లాంతర్లు చూసి ప్రజలు తమ కార్యక్రమాలు చేసుకునే వారు .అవేమిటో కూడా తెలుసుకుందాము

పల్లె టూరిలొ " గూటిలో పొద్దు - నోటిలో ముద్దా " అని సామెత వుంది .
అంటే సూర్యాస్తమయం అయినా వెంటనే అన్నం తినమని . మొదటి లాంతరు వెలగటానికి ముందే స్త్రీలు పిల్లలకి మొగుళ్ళకి అత్తమామలకు అన్నాలు పెట్టేసి గిన్నెలు తోమేసుకొనే వారు . కొంతమంది మొగవారు అచ్చెన్న దెగ్గరికి వెళ్లి మొదటి దీపం వెలిగింది గానీ మా ఆవిడ ముద్దా పెట్టలేదు అనే ఫిర్యాదు చేసేవారు . అప్పుడు అచ్చెన్న వారిని తనతో పాటు అన్నానికి కూచోపెట్టుకొని తగాదా పరిష్కరించే వాడు.

మొదటి లాంతరు దీపం వెలగగానే పిల్లలు పలకా బలపం తీసుకొని వీధి బడికి పోవాలి .లేకపోతే అచ్చెన్న మనుషులు వచ్చి పిల్లాడిని రెక్కలు పట్టి లేవదీసి మోసుకుంటూ వెళ్లి బడిలో కుదేస్తారు . అందువల్ల మొదటి దీపం టైంకి పిల్లలు బడిలో హాజరు ఉండేవారు.

రెండో లాంతరు వెలగంగానే గుడిలో ప్రసాదాల పంపిణీ అవ్వాలని అచ్చెన్న ఆర్డర్ .భక్త జనం రెండో లాంతరు వెలుగు చూసి గుడికి బయలు దేరే వారు . వారికి టైం ప్రకారం మరియు టైం వేస్టు లేకుండా ప్రసాదాలు చిక్కేవి . ఇదెంతో హాయిగా ఉండేది .

మూడో లాంతరు వెలగంగానే ఊరిలోని కల్లు దుకాణం మూత పడాలి .లేకపోతే కుండలు పగులుడు ఖాయం .

నాలుగో లాంతరు వెలగటానికి ముందే మొగవారు ఇళ్లు చేరాలి . లేదంటే వారికివీధి అరుగు చూపించే అధికారం ఆడవారికి ఇచ్చాడు అచ్చెన్న .

ఐదో లాంతరు వెలిగినాక ఇక ఊరిలోకి ఎవరికీ ప్రవేశం లేదు . అచ్చెన్న మనుషులుఊరి మొదటిలోనే ఆ వచ్చేవారిని అడ్డుకుంటారు . అందువల్ల ఊరిలోకి దొంగలు రావటం అసంభవం అయ్యింది . పగలల్ల పొలాలలో పని చేసి వచ్చిన ప్రజలు ఎక్కడివి అక్కడ పారేసి నిర్భయంగా నిద్ర పోవటానికి ఏ భయమూ ఉండేది కాదు .పశువుల దొంగతనములు అనేవి ఉండేవి కావు .

ఆరు నుండి తొమ్మిది లాంతబు లు వెలుగుతున్నప్పుడు వీధులలో ఎవరూ తిరగరాదు . ఈ సమయంలో గ్రామా దేవత ఎల్లమ్మ ఊరులో తిరుగును .

పదోవ లాంతరు వెలగ గా - స్త్రీలు బహిర్ భూమి కి పోవుటకు కేటాయించిన సమయము ..పగటి వేళ పరపుబుషులు చూచుచుండగా నీరు తెచ్చుకొనుటకు ఇష్టపడని స్త్రీలు - ఇదేసమయమున చెరువు నుండి నీళ్లు కూడా తెచ్చుకొన వచ్చును . ఈ 10 లాంతరు వెలిగినాక పురుషులు వీధులలోకి

వచ్చుట నిషేధము . ఉల్లంఘించినచో, అచ్చెన్నచే కొరడా దెబ్బలు తప్పవు .

పదకొండో లాంతరు వెలిగినాక, నీళ్ళకోసమై పురుషులు కావాడులు వేసుకొని ఇండ్లనుండి చెరువుకు రావచ్చును పోవచ్చును . దారిలో మహిళలు కనపడిన . వరసలు కలిపి పలకరించుకొన వచ్చు దీనికి ఏ తప్పూ లేదు.

పదకొండో లాంతరు తరువాత సూర్యుడు ఉదయించు వరకు చెరువులోని ఒక రేవు దేముని నీళ్లకు వదలవలెను . అర్చకులూ, బ్రహ్మలూ తప్ప . వూరిలో వారెవ్వరూ ఆ సమయమున ఆ రేవు కు రాకూడదు . పోకూడదు .

సూర్యాస్తమయం కాగానే అచ్చన్న నౌకరు ఒకరు లాంతర్ను వెలిగించి తీసుకేల్లి గోడ మీద పెట్టి వస్తాడు . సూర్యో దయం కాగానే వెళ్లి అన్ని లాంతర్లు కర్రకు తగిలించుకొని వాపసు తెస్తాడు . మళ్ళీ వచ్చే రాత్రికి మామూలే .

సూర్యో దయము జరిగి మొదటి ఢంకా మోగి , సాయంత్రము వేళా మొదటి లాంతరు వెలుగు వరకూ ప్రజలు తమకు తోచిన పనులు చేసుకో వచ్చు .

**A ORIGINAL ENTERTAINER BY VARANASI SREE RAMA KRISHNA**

**<><><><>**

## 10) స్వర్ణాంజలి షోరూం 26-10-22

స్వర్ణాంజలి షోరూం యజమానిగారు, పునరుద్ధరించి ,నిర్వహిస్తున్న ఊరి వెలుపలి పాత కాలం నాటి దేవాలయానికి

నేను మేనేజర్ని . మా ఆలయంలో వందవరకు కొబ్బరి చెట్లు , వాటి మధ్య అరటి చెట్లు . ఉండి, చల్లగా కూచొని ప్రకృతిఃని ఎంజాయి చేయటానికి వీలుగా చల్లని నీడల్లో రాతి తిన్నెలు ఉంటాయి .రుచికరమైన ప్రసాదాలు అవి పెడతాం . అప్పుడప్పుడూ భోజన ప్రసాదం పెట్టటానికి వీలుగా ఒక వంద కాళ్ళ రాతిమంటపాన్ని పునరుర్ధరించి ,ఒకే సారి రెండు వందల మంది కూచొని తింటానికి వీలుగ మార్పు చేసాము . మంచి ప్రశాంతమైన, రుచికరమైన గుడియే గానీ ప్రచారం తక్కువ వచ్చే జనం తక్కువ .

<><>

యజమానిగారు నన్ను పిలిచి " బంగారం లో గట్టి పోటీగా ఉందదండి - ప్రతి ఒక్కరు ఎదో ఆఫర్లు ఇస్తున్నారు . దీనితో మన అమ్మకాలు తగ్గి గోళ్ళుగిల్లుఉంటున్నాము " అని తన విచారము వెలిబుచ్చాడు . నాతో మాట్లాడిన తరువాత అయన ఈ రకంగా ప్రకటనలు ఇచ్చాడు . ఇదంతా నా నిర్వాకమే .

1 ) స్వర్ణాంజలి యొక్క నూతన షోరూం ని వ్వారికి చివర వున్నా పాండురంగ ఆలయ ము లోని మండపంలో ప్రారంభిస్తున్నాము - దీనివల్ల మాకు షాప్ అద్దెలు లేవు . ఆ ఆదాను మీకు బంగారం మీద తగ్గింపుగా ఇస్తాము

2} మేము మా నగలను దేముని గర్భగుడిలోనే వున్నా నేలమాళిగలో భద్ర పరుస్తున్నాము . అందువల్ల మాకు ఐరన్ సేఫ్ ఖర్చులు లేవు .సెక్యూరిటీ ఖర్చులు కూడా లేవు . ఆ ఆదా కూడా మీకు బంగారం మీద తగ్గింపుగా ఇస్తున్నాము .

3} నగలన్నీ రాతి స్తంభాలకు తగలిచ్చి ప్రదర్శించుతున్నాము . మీరు సూపర్ బజారులో సరుకులు ఎంచుకొన్నట్లు మా నగలను ఎంచుకొని కొని ఆనందించ వచ్చు . షాపింగ్ మాజాని పొందవచ్చు .మాకు షో కేసులు , ఏసీలు , ఖర్చులు వంటివి

లేనందున ఆ వచ్చిన ఆదానీ బంగారముధరలో తగ్గించుతాము .
ఈ రకంగా మా నగలు ఛాలెంజ్ రేట్లకే అమ్ముతున్నాము .

4} మా షో రూమ్ కి వచ్చిన ప్రతిఒక్కరిని - సాలంకృత కన్యామణులు లోనికి ఆహ్వానిస్తారు.

5} స్త్రీలకు పూలు . కుంకుమ పొట్లము , పురుషులకు డిస్పోసల్ రేజర్ వెల్కమిమ్మంగ్ గిఫ్ట్ గా ఇవ్వబడుతుంది . <> మా సేల్స్ గర్ల్స లో మీ నక్షత్రానికి , రాశికి నప్పే వారి చేతుల మీదుగా . మీరు కొనుగోలు చేసే నగలు మీ చేతికి ఇప్పించ బడతాయి .

5} మాషో రూమ్ కి వచ్చి మీరు ఏమీ కొన్నా , కొనకపోయినా, కూడా , మీ గోత్ర నామాలతో ఒక అభిషేకం ఫ్రీ .

మా నగలు శుభప్రదం , .ఫలప్రదం . ఐస్వరాదాయకం మోక్ష కారకం . ఎందుకనగా ప్రతి రాత్రీ నగలన్నీ గర్భగుడిలో ని నేలమాళిగల్లో స్వామి వారి నగలతో పాటుగా భద్రపరుస్తాము. వాటిని స్వామీ అమ్మవార్ల నగలతో పాటు శయనింప చేసి బయటికి తెచ్చేటప్పుడు ప్రతి ఒక్కటి దేవ దేవేరీ వారి పాదాలకు తాకించుకొని తెస్తాము .

ఫది గ్రాములు బంగారము కొన్నవారికి - లక్ష్మీ పూజ ఫ్రీ.

మా షో రూమ్ ప్రాంగణములో , ప్రఖ్యాత స్వామీజీ గారిచే నిత్యమూ ఒక హోమము జరపబడుచున్నది . పాతిక గ్రాములు బంగారము కొన్న వారికి, వారి నగలను ఈ హోమాగ్నికి తాకించి పవిత్రము చేసి ఇవ్వబడును. దీనివల్ల.మీ నగలకు తగల గల నర ద్రష్టి దోషాలు వంటివి తొలిగి పోవును .

జాబులేని వారికి జాబు వచ్చుటకు , పిల్లలు లేని వారికి పిల్లలు

కలుగుటకు ,కోడలు లేనివారికి వారికి కోడలు వచ్చుటకు గానూ , ప్రతినిత్యము మూడు వేరు వేరు హోమములుఅదనంగా చేయబడుచున్నవి .మీరు కొనుగోలు చేసిన పిదప, వాటిని మీరు కోరిన హోమమునకు గానీ అన్ని హోమములకు గానీ తాకించి తీసి ఇచ్చుట ఫ్రీ .

మీరు కొన్న నగలు చూచి, అద్భుతం అంటూ ఆశ్చర్యపోవటానికి , మిమ్మల్ని పొగడ టానికి గానూ ఆలయ ఆవరణలో. పేదవారయిన , పల్లెటూరి స్త్రీలని నియమించాము . వీరు మేడలో పసుపుతాడు తాళిబొట్టు బిళ్ళలు తప్ప వేరొక బంగారము ఎరుగని వారు .మీరు వారితో కబుర్లలోకి దిగి మీ బంగారముతో వాళ్ళను అవాక్కు చేయుటకు అవకాశము కల్పించినాము . ,వచ్చిన ఆంటీలతో కబుర్లుఆడేందుకు కాలేజ్ అమ్మాయిలను, మొగవారితో కబుర్లాడేటందుకు నిపుణులను { {భట్రాజులను } ఏర్పరిచాము . వీరు ఆలయ ప్రాంగణంలో ని చెట్ల క్రింద కూర్చొని వుంటారు . మీరు ఎంత సేపు గొప్పలు చెప్పుకున్నా వద్దు అనరు . అడిగి మరీ వింటారు .వంద గ్రాములు పైగా నగలు కొన్న వారికిఈ సర్వీసు ఫ్రీ .

మీరు కొన్న నగలను విదేశాలలో వున్నా మీ బంధువులకు చూపుటకు ఒక గంట పాటు వీడియో కాల్ ఫ్రీ . వారు నగలు డిజైన్ బాగో లేదన్నచో . వెంటనే మీపాతనగలకు కొత్త నగలతో ఎక్స్చేంజి సౌకర్యం .) " భారతీయు లు టన్నుల టన్నుల బంగారం కొని ఇంట్లో పెట్టుకొని ఏమి చేస్తున్నారు ఇది ఎకానమీకి ఎంత నష్టమో ? " అంటూ వాదించే విదేశీ ఎకనామిక్ఎ ఎక్స్పర్ట్ లతో- >>"కాదు మీ అభిప్రాయం తప్పు మేమే రైటు " అని వాదులాడుటకు మొగవారికి అవకాశము కల్పించబడినది . వాదనలో భార్య సాయము తీసుకొని అయినా సరే నెగ్గిన వారికి - మా షో రూమ్ తరఫున డైమండ్ నెక్ లెస్ బహుమతి గా ఇవ్వబడుతుంది .

మా షో రూమ్ ప్రాంగణములో పదారు ఆవులున్నవి . మీరు బంగారము కొని వెళ్లునప్పుడు , మీకు - మీ ఎదుటే పిండిన స్వచ్ఛమైనలీటరు ఆవు పాలు ఫ్రీ . ఆవు పాలు లేనప్పుడు పావు కేజీ ఆవు నెయ్యి ఫ్రీ . ఇవ్వేవి( లేనపుడు , ఆవు పాలతో చేసిన పాయసము , ఆవునేతితో వండిన రొండు గారెలు -మూడు బూరెలు పాత్రతో సహా ఫ్రీ .

కిలో లేదా ఆపై నగలు కొనుటకు వచ్చుచున్నామని ముందుగా చెప్పి అపోయింట్ మెంట్ తీసుకున్నవారికి - మేళతాలతో వేదమంత్రాలతో మా షోరూంలోకి ఆహ్వానించుట ఫ్రీ.

పెళ్లి నగల ఏడూ వారల సెట్టు మా వద్దనే కొన్నచో , వివాహ అనంతరము పెళ్లికూతురిని - పెళ్లికొడుకునూ పల్లకీ ఎక్కించి వూరేగించుట మరియు దానికి ఫోటోషూట్ ఫ్రీ .

దేవుని దయవల్ల మా వ్యాపారం ఎత్తుకుంది .

< > < > < > < >

## 11) బెల్లం పల్లీ లాయర్

గుంటూరు లో వున్నా ఇబ్రహీం లాయరుగార్ని గుంటూరు లాయర్ గా - శ్రీ శైలం లో వున్నా వెంకటేశంలాయర్ గార్నిశ్రీ శైలం లాయర్నుచేయటం వంటిది జనం చేతుల్లో వున్నా పని . . జనం " లాయర్లు కొద్దీ సేపు వాదించి - కాళ్ళ తీపులు వచ్చి్చా "థట్స్ అల్ యువర్ ఆనర్" అని 'చెప్పి కూర్చుండి పోతారని .అట్లాగే "చాలాసేపు వాదన చేయటానికి, మాట్లాడటానికి -

ఊపిరి దమ్ము పట్ట లేక కూడా "థట్స్ అల్ యువర్ ఆనర్ అని 'చెప్పి కూర్చుండి పోతారని , అనుకునేవారు .
ఎక్కువ సేపు నుంచోకపోవటం , దంచి కొట్టి మాట్లాడ లేకపోవటం - వల్ల నే తమకేసులు బలహీన పడుతున్నాయని ని - వాయిదాలు పడుతున్నాయని ప్రజల నమ్మకం .
ఇదే మా లా యర్ ధ్వజ స్తంభం వాలే నుంచుని, గంట మోగినట్లు మాట్లడుతూ ఉంటే జడ్జీ గారు వినక ఏమిచేస్తాడు ? అయన వున్నది వినటానికేగా ?ఆయనకు జీతం ఇచ్చేది వినటానికేగా ? మా లాయర్ సత్తువతో నించొని గంటల కొద్దీ దంచి మాట్లాడితే - ఐదారు వాయిదాలకంటే తక్కువలో తీర్పు రాదా ? అని కూడా ప్రజలు అనుకునే వారు .
ఒక లాయర్ గారికి పెద్దగా కేసులు ఉండేవి కావు . అందుకని అయన తన కోటు జేబులో ని ఒక దాంట్లో బెల్లము ఇంకో దాంట్లో పల్లీ పప్పు పోసుకుని నములుతూ చెట్టు కింద కూచునే వాడు .పల్లెటూరి వాళ్ళు ఈయన అలవాటు గమనించి '" మనము పొలంలో నడుమొంచి విరగబడి పనిచేసేందుకు బెల్లము పల్లీలు కలిపి తింటుంటాము కదా , అట్లాగే ఈయన కేసును వాదించటానికి కావాల్సిన బలం కోసం బెల్లము- పల్లీలు కలిపి తింటున్నట్లు వుంది . తిని ఎవ్వరెడీ బ్యాటరీ లాగా కనపెడుతున్నాడు - మంచి సత్తువ కలిగిన ఈయనకే మనకేసులు ఇద్దాము " అని ఈయనకి కేసులు ఇచ్చారు .
బెల్లం పల్లీల వల్లనో మరెందునో ఈయన " దట్సాల్ యువర్ హానర్ "అనే మాటలేకుండా ఘంటా పథంగా వాదించి జడ్జీలకు చుక్కలు చూపించి ప్రతి కేసూ నెగ్గుకొచ్చాడు .
ఇదే జనం అయన అసలు పేరు వూరు పేరు తప్పించేసి "బెల్లంపల్లీ " లాయర్ గారు అని ప్రచారం లోకి తెచ్చారు .
మన లాయెర్ గారు వాదించిన కొన్ని కేసులు :-
ఒకాయన వచ్చి " నాకూతురికి పెళ్లి జరిగి మూడు యేండ్లు అయ్యింది . . భార్య భర్తలు ఎప్పుడు కేకలు వేసుకుంటూ ఎడా

పెడాగా వుంటారు . అమ్మాయిని ఎమన్నా చేస్తారేమో అని భయంగా వుంది ఏమి చేయమంటారు అని సలహా అడిగాడు . అప్పుడు మన లాయర్ గారు ఒక కేసు కట్టి కోర్టులో వేసి ఇలా వాదించారు ".కూతురికి పెళ్ళికెళ్ళి చేసి . మనుమడినో మానవరాలినో ఎత్తుకొని అందరిలాగా తానూ ఆనందించాలనే కోరికతో నా కలైంట్ తన పిల్ల కు పెళ్లి చేసాడు . పెళ్లి మంత్రాల ద్వారా ఆమాట చెప్పి మరీ అప్పగింతలు చేసాడు . కానీ అప్పగింతలు పుచ్చుకున్న వియ్యంకుడు గారు అనగా పిల్లవాడి తండ్రి, తనకు ఏమీ పట్టనట్లు వూరుకుంటున్నాడు .ఇంటి పెద్దగా - భార్య భర్తలకు నచ్చ చెప్పి వారి మధ్య సఖ్యత కలిగేటట్లు , వారికి సంతానం కలిగేట్లు చూడటం "అనే తన భాద్యత విస్మరించినందుకు- నా క్లయింటు కి మనవలని చూసే ఆనందం దూరమైంది.ఇంతే కాకా పిల్లలు పుట్టలేదని కోడల్ని పుట్టింటికి తరిమేస్తారేమో నన్న భయంకూడా కలిగింది . బీపీ పెరిగింది . హార్ట్ రేటు పెరిగింది . హాస్పిటల్ ఖర్చులు పెరిగాయి . వారి వల్ల భయానికి లోను ఐనందుకూ .. ఆనందం కోల్పోయినందుకూ .. వైద్యపు ఖర్చులకోసమని - మొత్తం కలిపి యాభై లక్షల నష్ట పరిహారము ఇప్పించాలీ " అని వాదన చేసాడు .

దీంతో మొగపిల వాడి తండ్రికి మతి పోయింది . చివరాకరున కోర్టు వారు ఏమంటారో తెలియదు . ఇదికాక కోర్టు చుట్టూ తిరిగుడు.ఇకపై ఇంకా ఎన్ని కోర్టులకు వెడతారో తెలీదు . సరే ఇదంతా ఎందుకని పిల్ల వాడి తల్లి కోడలి కాళ్ళు పట్టుకొని బ్రతిమాలి ,తండ్రి కొడుకు కాళ్ళు పట్టుకొని బ్రతిమాలీ - తమ భాద్యత నెరవేర్చి భార్య భర్తలు సఖ్యతగా ఉండేటట్లు జాగర్త పడ్డారు . అవసరమనుకున్నప్పుడు భార్య భర్తలని ఆసుపత్రులకు తిప్పి పిల్లలు పుట్టేటట్లు చూసారు . కక్షి దారుకు దక్కాల్సిన ఆనందం దక్కిందని. వచ్చిన భయం పోయిందని తేల్చిన కోర్టు వారు . హాస్పిటల్వా ఖర్చులకి గానూ పదిలక్షలు ఇవ్వాలని లేదంటే మూడు నెలలు జైలు శిక్ష అని చెప్పి

కేసుముగించారు . మన బెల్లం పల్లి లాయర్ గారికి ఫీజు బాగానే ముట్టింది .
ఇంకో కేసులో ఒక సాఫ్ట్ వెర్ అమ్మాయి వచ్చి " నాతల్లి తండ్రులు నా వివాహాన్ని గురించి శ్రద్ధ పెట్టటం లేదు . నేను కోరని కోర్కెలు ఏవేవో వారు నా తరఫున కోరుతున్నారు . ఇంతకీ తెమల్చటం లేదు . ఏదన్న కేసు వేయొచ్చా " అని అడిగింది .
మన లాయర్ గారుమీ కజిన్ సిస్టర్స్ ఎవరన్నా వున్నారా ? ఉంటే పిలిపించు కేసు వేద్దాము అన్నాడు . ఆమె తన బాబయ్య కూతురు తనకు చెల్లెలుఅయినా అమ్మాయిని రప్పించింది చివరికి ఇట్లాగా కేసు వేశారు " హిందూ ధర్మ ప్రకారం అక్కకు పెళ్లి గానిదే చెల్లి పెళ్లి చేయటానికి వీలు లేదు . మా పెదనాన్న గారు ఎంతకూ తన కూతురి పెళ్లి చేయనందున నా వివాహం ఆలస్యము అవ్వుతున్నది . వివాహం ఆడి ఆనందించాల్సిన వయసును కోల్పోతున్నాను . ఇందువల్ల నేను నా పెళ్లి తరువాతా రోజుకు రొండింతలు లేదా మూడింతలు షాపింగ్ లు చేసి ఆనందించవలసి వుంది . అందుకు ఎక్కువ డబ్బు అవసరమౌతుంది . అందువల్ల మా అక్కకు పెళ్లిగాని ప్రతి సంవత్సర కాలమునకు ఒక పాతిక లక్షలు లేదా నెలకు మూడు లక్షల చొప్పున నాకు ఇప్పించవల్సింది . "
ఇదెక్కడి కేసురా .. ఇంటి గుట్టు రచ్చ కెక్కినట్లు వుంది .. అని కేసు రొండో వాయిదా నాటికి పిల్లకి పెళ్లి చేసి పారేసాడు తండ్రి

<><><><>

12) . అట్లు వేయుట- అంట్లు తోముట...

ఒక దేశానికి ఇంకో దేశానికి యుద్ధము జరుగు తున్నప్పుడు శత్రు దేశాల కు పట్టు పడిన సైనికుల పరిస్థితి ఏమిటి ? వారిని ఏమిచేయాలి ? అని అంతర్జాతీయంగా అమలులో వున్నా జానీవా ఒప్పందం అనేది , దీన్ని గురించి ఏమి చెపుతున్నది

అనే కొన్ని విషయాలు  తెలుపుట ఏ  ఈ వ్యాసము లోని విషయము .

మూడోవ జానీవా ఒప్పందం క్రింద అన్ని దేశాలు - తమకు చిక్కిన సెత్రు సైనికుల ను అందరినీ " యుద్ధ ఖైదీలు" అనే పేరుకింద అదుపులోఉంచాలి  .ఖైదీ అనరాదు .
 ఆ శత్రు సైనికుడు దేశానికి ఎంతో నష్టం కలిగించి ఉంటాడు . బాంబులు వేసి, ఆస్తులు నాశనం చేసి ఉంటాడు , ప్రజల చావుకి ,  సైనికుల మరణానికి కారణం అయ్యి ఉంటాడు .కానీ ఇతడిని యుద్ధ ఖైదీగా అదుపులోకి తీసుకున్నప్పుడు - అతనివల్ల దేశానికి జరిగిన  నష్టం గురించి  ఎటు వంటి క్రిమినల్ కేసులూ పెట్ట  కూడదు. పెట్టి కోర్టులలో విచారింపగూడదు .ఈ నియమము యుద్ధ సమయములో చేతికి చిక్కిన సైనికునికే  వర్తిస్తుంది కానీ-- చాటుమాటుగా దేశం లోనికి ప్రవేసించి న శత్రు సైనికులకు   వర్తించదు .
యుద్ధ ఖైదీగా చిక్కిన శత్రు సైనికులను ,   యుద్ధము చేయకుండా చూసే ఉద్దేశ్యముతో మాత్రమే నిర్బందించాలి .వారికి ఏ పనిష్మెంట్ ఇవ్వకూడదు . యుద్ధము ముగిసిన వెంటనే ఆ సైనికుని అతని దేశానికి పంపి వేయాలి . వీరిని హింసించటం గాని అవమానించటంగానీ,  చిన్నబుచ్చటం గానీ , గేలి చేయటం కానీ చేయకూడదు . అంతేగాక అతడిని ప్రజలముందు ప్రవేశ పెట్ట కూడదు . కనీస అవసరాలైన తిండీ కూడు గుడ్డ , వైద్యము మందులు ఇవ్వాలి .
యుద్ధ ఖైదీ ని ఎందుకు అదుపులోకి తీసుకోవాల్సి వచ్చిందో - ఆ కారణాలు -   కనుమరుగైన పోయిన వెంటనే యుద్ధ ఖైదీని వదిలి వేయాలి . యుద్ధ విరమణ ఒప్పందం వరకూ వేచి చూడ నవసరం లేదు  .  శత్రు దేశ సైనికుడు  - తమ  అదుపులో ఉండగా ఎవరూ చంపగూడదు .అలాంటిది  జరుగుతుందేమో అన్నప్పుడు అతని వేరే ప్రదేశానికి తరలించాలి .రక్షణ కలిగించాలి

వీరిని జైలు లేదా గదులలాంటి వాటిలో ఉంచ రాదు . బహిరంగంగా కాంపులలో మాత్రమే ఉంచాలి .దొరికిన వారిలో అంగవైకల్యము వున్నా వారిని అనారోగ్యం తో ఉనావారిని గాయపడ్డవారిని వేరుగా గుర్తించి -సాధారణ మానవ హక్కుల ప్రకారం వారిని చూసుకోవాలి
.
ప్రిసొనెర్స్ అఫ్ వార్ అనగా POW స్ అనబడు వీరికి - యుద్ధము లో పట్టుబడే నాటికీ రావలిసిన జీతాలు మరియు అలవెన్సులు అతని దేశం వారు చెల్లించుతారు . POW గా ఉన్నంత కాలము అతనికి కొంత జీతం గూడా అతని దేశం వాళ్ళే చేల్లించాలి. ఎంత అంటే ప్రపంచంమొత్తము మీదా సగటు జీతము ఎంతో అందులో సగము..
తగిన కారణం లేకుండా POW విడుదల ను జాప్యం చేస్తే . వారి జీతాలు వారిని నిర్బంధించిన దేశపు వారు చెల్లించాలి . దీనివల్ల యుద్ధమం లో వున్నా దేశాలు ఆర్ధిక భారం దృష్ట్యా వెనక్కు తగ్గుతాయనేది దీని ఉద్దేశ్యము కావచ్చు.

వీరు అంతర్జాతీయ రెడ్ క్రాస్ ద్వారా , తమ భార్య పిల్లలు లేక , తల్లీ తండ్రులతో మాటాడి తాము పట్టుబడినాక ఎక్కడ బంధింపబడి వున్నది తెలుపుకొనే హక్కువుంది . - ఇంకా వారి నుండి ఆహార పదార్ధపు పాకెట్స్ కూడా అందుకోవచ్చు .
చిక్కిన శత్రుసైనికుల అందరి చేతా { ఆఫీసర్ రాంక్ మరియు ఆపై స్థాయి వారిచే తప్ప } నిర్బంధంగా అంటే బలవంతంగా పనిచేయించుకోవచ్చు .వీరి చేత గనులు తవ్వించటం , ఇనుప ఫాక్టరీలలో బండపనులు చేయించటం .. రైలు పట్టాలు వేయించటం లాంటివి కూడా చేయించవచ్చు . చేయిస్తారు కూడా .

వీరికి మరణ శిక్ష విధించటానికి వీలులేదు . కానీ చేతికెక్కిన శత్రు సైనికులలో తమ దేశము వారు ఎవరన్నా కలిపి పట్టు బడితే వారికీ మాత్రము మరణ శిక్ష వేయ వచ్చు .
జెనీవా ఒప్పందాన్ని అన్ని దేశాలు అమలు పరచాలి అని అన్నారేగానీ దీన్ని అమలుచేసే అధికారం ఎవరికీ , ఏ దేశసానికీ లేదా ఏ UNO సంస్థ కూ లేదు . అంతర్ జాతీయ ఒత్తిడులకు లోపడి ఆ య దేశాలు ఈ రూల్సుని పాటిస్తూ వున్నాయి .
ఈ పై రూల్సన్నీ చూస్తే యుద్ధ రంగంలోని సైనికులను కూడా సాధారణ మానవతా దృష్టితో చూడటానికి రూపొందించబడినవి అని అనిపిస్తూ ఉంటుంది .

ఇహ మన కథ ఏమిటంటే మన దేశానికి ఒక సెత్రు సైనికుడు పట్టు పడ్డాడు . ఇతన్ని యుద్ధ ఖైదీగా గుర్తించి .. ఆతరువాత అతనితో "నీవేమి పని చేస్తావు ? మా మిలట్రీ ఆఫీసుల్లో దొడ్లు బాత్రూంలు కడుగుతావా ? లేక మా మిలటరీ కాంటీన్ లో కుక్ గ వుంటావా ? అని అడిగారు . వాడు ఏమనుకున్నాడు అంటే " ఈ దేశము వారు మానవతా గుణంతో జెనీవా ఒప్పందాన్ని అమలు పరుస్తూవున్నారు .అంటే వీరు ఎంతో దయామయులు . మహానుభావులు . . మానవతా ,దయా ధర్మమూ ప్రదర్శించే వారు అందుకనే నాకు ఇట్లా ఒక ఆప్షన్ ఇచ్చారు . అలాకాక నేరుగా "దొడ్లు కడుగు ఫో " అని ఓ ఆర్డర్ వేసివుంటే నేనేమి చేయగలవాడిని ? . దొడ్లు కడుక్కుంటూ కొన్నాళ్ల పాటు బ్రతికాననన్న అవమానం నన్ను జీవితాంతం వెంటాడేది . వీరు మంచితనానికి నా జోహార్లు . " అనుకోని కిచెన్లో పని అడిగాడు "

అతనికి కిచెన్ పని వేశారు . మిలటరీ కిచెన్లో రోజుకి నాలుగు వందల ఉల్లి దోసెలు అవసరం . అతడువీటిని నిరాఘాటంగా సప్లై అయ్యేట్లు చూడాలి .. ఫెయిల్ అయితే కొండలు తవ్వటానికి పంపుతారు.

ఈడ్యూటీ పడ్డవాడు  ,  ముందు గా   సాయంత్రం పూట ఫది కేజీల పప్పు నానబోసుకొని  తెల్లారగట్ల మూడింటికి లేచి పిండి వేసుకొని -అనంతరం చాలీసు కేజీల ఉల్లిపాయలు తరిగి ఉంచుకోవాలి . మూడు రకాల  చెట్నీలు , సాంబార్ రెడీ ఉంచాలి . ఉదయం ఏడూ గంటల నుండి ఫది గంటలలోపు నాలుగు వందల  అట్లు వేయాలి . ఆతరువాత పిండి ఎమన్నా మిగిలితే  ఒక అట్టు వేసుకొనితిని  క్యాంటీన్లకి చెందిన అన్ని అంట్లూ కడగాలి .ఇతడిలాగానే క్యాంటీన్లో పని చేస్తున్నఅతని దేశస్థుడు   ఒకడు వచ్చి " మేము తప్పించుకోవటం కోసం ప్లాన్లు వేస్తున్నాము - కలుస్తావా అని రహస్యంగా  అడిగాడు . అప్పుడు వీడు " తప్పించుకు పోయి ఏమి పావుకుంటామని ? యుద్ధం లో మనము  వీరిని  గెలిచేదీ లేదు చచ్చేదీ లేదు. అట్లు వేసుకుంటూ -  అంట్లు తోముకుంటూ ఇక్కడే ఉండాలి   - అనిపిస్తోంది . నేను రాను పో  నాకు అక్కడికన్నా ఇక్కడే బాగుంది .   " అన్నాడు . దేశాన్ని గుర్తుచేసుకుంటూ . మానవత్వం మూలకంగా మన సెత్రువు మన దేశ మిత్రుడిగా అయినాడు  .మనము  ఎవరికైనా సరే నచ్చుతాం . మానవత్వం అనేది యుద్ధము లేకుండానే అనేక మంది సెత్రువులను చంపుతుంది .

<><><>

## 13) ఇంద్రాణి గట్టెక్కేసింది 19-11-22

ఇంద్రాణీ ఎం టెక్ మైక్రోవేవ్ ఇంజినీరింగ్ చదివింది . పేద ఇంటి పిల్ల . హౌస్ వైఫ్ గా ఉండటానికి ఇష్టపడితేనే మీ అమ్మాయిని మాకోడలను చేసుకుంటాం అని చెప్పి మరీ ఆమెను తమ ఇంటి కోడలిని చేసుకున్నారు కోట్ల ఆస్తివున్న కోటేశ్వర స్వామీ & ఫామిలీ వారు . ఇంద్రాణికి కూడా ఇల్లు పిల్లలు , పెనిమిటి ని , చూసుకుంటూ ఫామిలీ లైఫ్ ఎంజాయ్

చేయాలన్న ఉద్దేశం తోనే వున్నది . అందువల్ల నిరభ్యంతరంగా పెళ్లి అయింది .పెళ్లి అయ్యి ..కోరుకున్న కోడలు ఇంటికి రాగానే కోడలికి వంటిల్లు అప్పచెప్పింది అత్తగారు .
ఇంద్రాణి కింద పని చేయ టానికి ఒక టెంపరరీ గా అసిస్టెంట్ వంటలక్క ను కూడా ఇచ్చి - కోడలి మీద తనకు గల ప్రేమను చాటుకుంది అత్త గారు . అసిస్టెంట్ కుక్కు గా ఉన్న ఆమె ఇంద్రాణితో " మీ మామగారికి పగలు పూరీలు అంటే , రాత్రి కి చపాతీలు అంటే పిచ్చి . కానీ ప్రతి దానికి అట్లా వున్నాయి ఇట్లా వున్నాయి అని అని వంకలేయటం ఎక్కువ . కూర ఎంత బాగా చేసినా ఆయన్ను మెప్పించలేము - ఒప్పించలేము . ఈయన వల్ల ఈ ఇంటి వంటలక్కలకు పావు సేరు నరకం కనపడుతుంటుంది. . ఇక పోతే మీ అత్తగారికి అన్నీ వేడి వేడిగా పొగలు కక్కుతూ ఉండాలి . డైనింగ్ టేబుల్ ముందు కూచొని- టీవీ చూస్తూ నూ, సెల్ఫోనులో ముచ్చట్లు వేస్తూనూ గంటల తరబడి డైనింగ్ టేబుల్ దెగ్గరనుంది కదలదు . రాత్రి ఎనిమిదింటికి మొదలు పెట్టిన భోజనం రాత్రి పన్నెండింటికి కానీ ముగియదు . నీ మరుదులూ . నీ భర్తా కూడా అమ్మ రొటీన్ కి అలవాటు పడి - అమ్మతో పాటే కూచుని హస్కు లేస్తుంటారు . - ఈ లోపు ఏ పదార్ధం చల్ల బడినా గిన్నెలు విసిరేస్తూ వుంటారు . వాళ్ళు తింటున్నంత సేపు మనం జాగర్తగా గమనిస్తూ - ప్రతి పదార్ధాన్ని మైక్రో వేవ్ ఒవేన్ లో పెట్టి - ఒకటి కి పద్ధి సార్లు వెచ్చని చేసి వడ్డిస్తూ ఉండాలి . దీనికోసమని మనం రోజూ నాలుగు గంటల పాటు నిలువు కాళ్ళ మీద నిలబడాల్సి ఉంటుంది . ఈ భోజన కార్యక్రం ముగిసే సరికి మిగతా ముప్పావు సేరు నరకం కనపడి తీరుతుంది . ఈ యాతన భరించలేక చాలామంది వంటలక్కలు పరారు అయ్యినారు . నేను కూడా పరారు అయ్యే దానినే . కానీ నాకూ మీ అత్తగారికి దూరపు బంధుత్వం వుంది . నాకు కోడలు రాగానే నీకు పని లేని జీతం ఇస్తానని మీ అత్త గారు ఆశపెట్టిందమ్మా .." అంటూ

ఇంటి విషయాలు నివేదించింది అసిస్టెంట్ కుక్కు గా ఉన్న ఆమె.
ఇంద్రాణి ఇంటికోడలు కాబట్టి -అత్తా మామలు ఆమెతో ఎదో కొంత సున్నితంగా వుంటారులే అనుకోవద్దు. కుక్కతోక ఎన్నడైనా వంకరే . కోడలు ఎటూ తప్పించుకో పోలేని తమ పెరిమినెంట్ వంటలక్క అన్న రేంజిలో మాట్లాడుతూ ఉండేవారు .
మామగారు చపాతీలుతింటూ " ఇవేంటి కోడలా ? ఈ కూరేమిటి కోడలా ? గొడ్లు కూడా తినేట్లు లేవు " అని కామెంట్లు ఇస్తూ వుండే వాడు .
ఇక అత్త గారిని చూస్తే "ఆమె కూడా ఇంకా వేడి వదలని వంటలకి కూడా చప్పగా చల్లారిన అన్నాలు , ఐస్ క్రీమ్ ముద్దల్లాంటి కూరలు అంటూ వంకలు పెట్టి ఇదివరకు కన్నా రెట్టింపు రచ్చ రచ్చ చేయటం మొదలు పెట్టింది .
ఇంతే కాకుండా పనిలో పనిగా ఇంద్రాణి భర్తకు అంటే తన కొడుకుకు ఏవేవో కబుర్లు చెబుతూ అతడు డైనింగ్ టేబుల్ దెగ్గర తనతో ఎక్కువటైం గడపటం కోసమని - ముచ్చట్ల టైం పెంచింది . ఇప్పుడది రాత్రి ఎనిమిది నుండి అర్ధరాత్రి ఒంటిగంటకు మారింది .
కాలం గడుస్తుండగా ఇంద్రాణికి విసుగెత్తుకొచ్చింది . కాపురం కాదనుకొని పుట్టింటికి పోదామా అనుకుంది .భర్త మొహం చూసి అన్నింటికీ సర్దుకుంది .
అప్పుడు ఆమె " నేను ఇంత చదువు కున్న దాన్ని కదా ? ఏదన్నా ఉపాయంతో గండం గట్టెక్కలేనా? అనుకుంది .
అనుకున్నదే తడవుగా గండాన్ని గట్టెక్కేసింది .???
" చపాతీలు అన్నా, కూరాలన్నా ఇట్లాగే వుండాలమ్మా .. చాల బాగున్నాయమ్మా " అని ఆనందంతో ఆబ ఆబ గా తిన సాగిండు ఇంద్రాణి . మామగారు .
కోడలు చేసిన ట్రీట్ మెంట్తో , మరి కొన్నాల్టికి అత్తగారు కూడా మంచి దానికి మల్లె మళ్ళీ పోయింది . కూచున్న ఒక్క

గంటలోపు భోజనం ముగిస్తుంది . దాంతో ఇంద్రాణి భర్త ఫది లోపే పండగ్గదిలోకి దూరుతున్నాడు .
కోడలు ఇంద్రాణి బాగా అలోచించి, మామగారి గత జీవితం గురించి ఎంక్వయిరీ చేసి ఏమి తెలుసు కున్నది అంటే - అయన మొదటిలో ఒక పెద్దకంపెనీకు సేల్స్ రెప్. నార్త్ ఇండియా అంతటా టూర్ లు వేస్తూ చపాతీలు, పూరీలు కూర్మాలు , కూరలు తింటూ బ్రతికి అన్నం అనేది మర్చి పోయాడు . - చివరకు బిజినెస్ పెట్టి అది కొడుకులకు అప్పచెప్పి నేడు విస్రఅంతిగా ఇంటిపట్టున విశ్రాంత జీవితం గడుపుతున్నాడు .
ఒకనాడు ఇంద్రాణి గోధుమ పిండి బస్తాలను హోల్ సెల్ గా అమ్మే షాప్ కి వెళ్లి "స్మార్ట్ హోటల్ పిండి " ఇవ్వండి అని అడిగింది . వాళ్ళు నేలమీద దుమ్ములాగ పరుచుకున్న గోధుమపిండిని చిమ్మి విడిగా అమ్ముతాబు . అదే " స్మార్ట్ హోటల్ పిండి" అంటే . మన ఇంద్రాణి ఆపిండి తెచ్చి చపాతీలు చేసింది . కూరల మార్కెట్కి వెళ్లి , అక్కడ గ్రేడింగ్ చేసి "అమ్మకానికి పనికి రావు అని పక్కన పడేసిన " కుళ్ళు కంపు" కూరలను కొనుక్కచ్చి కూరలు వండింది . తనకు అలవాటైన రుచి , వాసనా తగిలే సరికి మామగారు ఖుషీ అయినాడు . అయన గొడవ వదిలిపోయింది .
ఇక అత్తగారిసంగతి వున్నది .
ఇక మన అమ్మాయి మైక్రో వేవ్ ఇంజినీర్ కదా ? అందువల్ల ఇంట్లో ఉన్న మైక్రో వేవ్ కుక్కరికి ఏవో మార్పు లు అవీ చేసి , ఏవేవోపరికరాలు జత చేసి , . దాన్ని డైనింగ్ టేబుల్ వైపు గురి పెట్టి ఉంచింది .
అందరూ భోజనానికి కూచోగానే దాన్ని ఆన్ చేస్తుంది . దీనివల్ల పదార్థాలు ఎప్పటికీక్ చల్లబడవు - పైగా ఇంకా ఇంకా వేడెక్కుతున్నాయి . ఒక్క గంటలోపు భోజనం పూర్తి కాలేదనుకోండి - అప్పటినుండీ శరీరాలలోని మాసం కూడా వేడెక్కటం మొదలవుతుంది . . అందుకని అంటే ఈ అంతు

పట్టని వేడికి దడిచి, తన ఆరోగ్య ము ఎదో చెడిందని భ్రమసి అత్తగారు కొడుకులతో మీటింగ్ మాని వేసింది - కొడుకును బేడ్రూముల్లోకి పోనించింది .
ఈ రకంగా ఇంద్రాణి గట్టెక్కేసింది
a original by varanasi sree rama krishna

----------------------------------------------------------------

**14)మహా నంది .. 7-11-22**

కార్తీక మాసం పున్నమి రోజున ఒకాయన కృష్ణ స్నానికి వెళ్ళాడు .
అప్పటికి ఇంకా సూర్యుని జాడలేదు .చంద్రుని వెలుగే అన్నింటిని చూపిస్తూ వుంది. ఈయనకి నీటిలోనుండి ఒడ్డుకు ఈదుకొస్తు్తున్న ఒక రాతి నంది కనపడ్డాడు . ఈయన నాలుగు అడుగులు ముందుకు వేయగా నంది 40 అడుగులు ముందు కొచ్చింది . ఈయన దానికి నమస్కరించగానే నంది మానవ భాషలో " నువ్వు నమస్కరించిన తీరు చూస్తే - నీకు కైలాసపు వాట్సాప్ప నెంబర్ ఇవ్వాలని అనిపిస్తూ వుంది ." అని చెప్పింది .
స్థానానికి దిగిన పుడు ఈయన ఒడ్డున పెట్టి వచ్చిన సెల్ ఫోను ఈయన చేతిలోకి వచ్చింది అదీ నంది మహత్యం .
ఈయన వెంటనే యమా లోకానికి వాట్సాప్ పెట్టాడు ." పూజలు అవీ గొప్పగా చేయిస్తూనే వున్నాను గదా ? నా సంగతి ఏమను కుంటున్నారు సార్ ?" అని .
మరు నిముషంలోనే ఆయనకు తిరుగు మెసేజ్ వచ్చింది .
" నీకు డెబ్బై దాటినవి . ఈవయసుకు నీవు నీ లోకాన్ని, ప్రేమిచటం , క్షమా- కరుణా గుణము కలిగి ఉండటం నేర్చుకుని ఉండవలసింది . కానీ నీవు ఇంకా కూడా , నీ ధన బలాన్ని చూసుకొని , లోకాన్ని అందులోని నీ బందు గుణాలని పేరు పేరు తలచి మరీ ద్వేషిస్తూ , వారి ప్రవర్తన ను తూర్పార పట్టి

ఎండగడుతూ , వారితో పంతాలకు పట్టింపులకు , . కక్ష సాధింపులకు పోతున్నావు . ఫోన్లు చేసి మరీ అందరి మనసులు కకావికలు చేస్తున్నావు . ఇదే నీముఖ్య కాల క్షేపంగా పెట్టుకున్నావు .
నీవంటి వారి కోసం నేటి కాలానికి తగ్గట్లు కొత్త శిక్షలు రూపొందిస్తూ వున్నాము . అవి ఫైనల్ అయ్యేలోగా నీవు షుగర్ బీపీ గుండె జబ్బులు అంటి వాటిని అభివృద్ధి చేసుకుంటూ బ్రతక వలసినదని శివుని ఆజ్ఞ . చివర్న నీవు పక్కలోనే మూత్రం విడిచే స్థాయికి దిగజారుతావు . అది సాకుగా చూపి చూపి నిన్ను తిట్టాలనుకున్న వారందరూ తిట్టినాక , నిన్ను ఎండకట్టినాక నే నీకు విముక్తి "
" ఛీ నువ్వేమి నందివి- చూడబోతే ఆ శివుని సద్ గుణాలు అన్నీ నాలో వుండాలని చెపుతున్నట్లు వుంది . నీతో నాకేంటి ? నేను మహానంది వెళ్లి స్నానం చేస్తాను అది బహు మంచిది " అని అని నదిలో నందిని విమర్శించి దాన్నిచి ఒడ్డు ఎక్కి కారు డ్రైవర్తో " పద మహానందికి పోదాం " అని ఆర్డర్ వేసాడు .,



**15) మూలికా మహత్యము 22-11-22a**

**ఇంటిలోని పోరు ఇంతింత కాదయ్యా అనుకుంటూ ఇంట్లోకి వచ్చాడు విశ్వనాథ్. అతనికి నాలుగేళ్ల క్రింద పెళ్లాడిన భార్య , నభయ్ ఏళ్ళక్రింద కన్న తల్లీ ఇంట్లో వున్నారు .**

**అతని తల్లి, కోడలిని ఎప్పుడూ ఎదో ఒకటి అంటూనే ఉంటుంది .**

**కోడలు అత్తతో యుద్ధానికి దిగుతూ ఉంటుంది .**
**పగలల్లా జరిగిన ఈ తగాదాల సారాన్ని - విశ్వనాథ్ కి వివరించి "**

అది నన్ను ఎంత లేసి మాటలు అంటుందో నీకు తెలీదు .నీ భార్యకు మంచిగా బుద్ధి చెప్పు " అని కన్నీరు పెట్టుకుంటుంది అతని తల్లి రమాదేవి .

పగలల్లా జరిగిన ఈ తగాదాల సారాన్ని - భర్త విశ్వనాధ్ కి వివరించి " మీ అమ్మ నన్ను ఎంత లేసి మాటలు అంటుందో ఏమిటో మీకేమీ తెలీదు. మీ అమ్మను కంట్రోల్ లో ఉండమని చెప్పండి. లేకపతే తేడాలు వస్తాయి " అని కన్నీరు కార్చేస్తుంది విశ్వనాధ్ భార్య సుధా రాణి.

విశ్వనాధ్ ఇంటికి వచ్చి టీ తాగి పెండింగ్ వర్క్ చూసుకోవటానికి తన ఆఫీస్ రూమ్ లో కూచున్నప్పుడు - అతని తల్లి , ఇక బొజ్జ నిండాతిని పడుకోవటానికి వెన్ను వాల్చిన వేళ అతని పత్ని - వారి వారి వాదనలు విని పించి - విశ్వనాధం యొక్క జడ్జీ మెంట్ అడుగుతారు . ఇది శని ఆది వారాలు తప్ప ఇది అన్ని రోజులూ జరిగే కోర్టు.

ఈ రోజున ---- కొడుకు ఆఫీసు గదిలో పని చూసుకుంటుండగా తల్లి వచ్చి "అదేదో తెప్పిస్తానన్నావు . తెప్పించావుటరా ? అని గుసగుసగా .. అడిగింది .

" ఆ ఇంటర్ నెట్ అంత వెతికి వియత్నాం నుండి ఓ చైనా మూలిక తెప్పించానమ్మా . నీవు దీన్ని 24 గంటలుపాటు ఫ్రిజ్జులో పెట్టి .. ఆ తరువాత దాన్ని 48 గంటల పాటు -ఎండపెట్టి , మెత్తగా పొడిలా దంచి , అది అంటే నీ కోడలు తినే తిండిలో కలుపు. ఈ మూలికకు రంగు రుచి వాసన ఏమీ వుండవు . అద్భుతమైన పని

తీరు తప్పు . ఈ మూలిక సారం నీ కోడలి కడుపులోకి పోయినాక - దానిరక్తం లో అనేక మార్పులు జరిగి, దానికి కోపం రాగానే దాని స్వర పేటిక మూసుకు పోతుంది . మాట పెగలదు . కోపం తగ్గిన గంటసేపటికి కానీ స్వర పేటికమామూలు కాదు . అప్పుడు కానీ మాట పెగలదు . ఇహపై నువ్వు నీ కోడల్ని ఇష్టం వచ్చినట్లు అను . అదిఏమీ బదులు చెప్పలేదు . నీ ప్రాబ్లెమ్ సొల్వెడ్ . వచ్చే సండే తరువాత మూలిక పని పెట్టుకో " అని తల్లికి చెప్పాడు విశ్వనాధ్.
ఇదంతా చెప్పేటప్పుడు అతడు కావాలనే కొంత స్వరం పెంచి చెప్పాడు . పక్క గదిలో గోడకు చెవులు ఆనించి వింటున్న భార్య సుధకు అంతా క్లియర్ గా వినపడాలని . ఆమె కూడా అంతా క్లియర్గా నే విని . నో డౌట్స్ అనుకుంది .

విశ్వనాధ్ బెడ్ రూమ్లోకి రాగానే సుధా నేరుగా విషయానికి వచ్చింది . అప్పుడు విశ్వనాధ ఏమి చెప్పాడంటే " . నీకోసంకూడా ఒక మూలిక తెప్పించాను . ఇది కోడలు వెర్సెస్ అత్త మూలిక . అదేమో అత్తా వేరేసెస్ కోడలు మూలిక . మా అమ్మకు చెప్పిందంతా విన్నావుగా ? నువ్వుకూడా ఈ మూలికను దంచి పొడి చేసి మా అమ్మకు తినిపించు . ఆమె రక్తంలో మార్పు వచ్చి - నీమీద కోపం రాగానే ఆమె కంఠం మూసుకు తొతుంది . నువ్వు హాపీ గ ఉండొచ్చు " అని

టీవీ మ్యూట్ లో పెట్టి భార్య భర్తల సంభాషణను చెవులు రిక్కించి వింటున్న తల్లికి విషయం అంతా స్పష్టంగా భోద పడింది .

" మనం ఎవరితోనన్న సఖ్యత గాను స్నేహంగాను ఉంటే వారు తొందరపడి మన కి హాని చేసే పాపానికి తలపెట్టారు గదా ? అని అలోచించి 25 %,
" కోపాలు తెచ్చు కోవటం ఎందుకు ? గొంతులు పోగొట్టుకోవటం ఎందుకు ?? " ఆలోచిస్తూ మరో 25 %,
" కోడలు తన మీద ఎప్పుడు మూలిక ప్రయోగిస్తుందేమో అనే50 % భయంతో అత్తా , అత్త తన మీద ఎప్పుడు మూలికా ప్రయోగం చేస్తుందో నాన్న 50 % భయం తో కోడలు , తమ తమ హద్దుల్లోకి ఒదిగి పోయారు .
కోడలు తన మూలికను తన పుట్టింటికి పంపి దంపించిన పొడిని తెప్పించి తన మీద చాటు మాటుగా ప్రయోగిస్తుందేమో ననీ అత్త గారికి లోలోపల భయం వుంది . అత్త గారు తన మూలికను తన తమ్ముడి ఇంటికి పంపించి దంపించిన పొడిని తెప్పించి తన మీద ప్రయోగిస్తుందేమో ననీ, కోడలికి లోలోపల భయం వుంది . ఈ భయం మూలంగా అత్తా కోడళ్ల ప్రేమ మరింత బల పడింది
అసలు ఈ మూలిక ప్రాయోగాన్నే అడ్డుకోవాలి అన్న ధ్యేయంతో , ఇదివరకు అత్తగారు వంటచేస్తూ ఉంటే పడకటింట్లో దూరే కోడలు నేడు వంట జరిగినంత సేపు అత్తగారికి అసిస్టెంట్ గా ఉంటుంది .

కోడలు కాఫీలు టిఫిన్స్ తయారు చేయటం పూర్తయ్యే వరకు నిద్ర నటించి -అప్పుడు నిద్రలేచి కాఫీ కోసం కేకవేసే అత్తగారు నేడు, ప్రతి చిన్నపనిలో కోడలికి వత్తాసుగా నిలబడి ఉంటుంది. నిజమైన పస ఏమీలేని ఆ మూలిక ప్రయోగం జరగకుండా నే ఒకరితో ఒకరు ఆప్యాయతపంచుకుంటున్నారు అత్తా కోడళ్ళు .

